శ్రీ.

కృష్ణ గురుపరబ్రహ్మణేనమః.

23 NOV 1922

# దశావతారములు

ఇయ్యది

దేవినేని సూరయాఖ్యునిచే

రచియింపఁబడి,

కొక్కిలిగడ్డ క్రొత్తపాలెము వాస్తవ్యుఁడగు,

మత్తి రామారావుచేఁ

ప్రచురింపఁబడి,

మచిలీపట్టణస్థిత:-

శ్రీ-ఆర్యానంద ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియెను.

ప్రథమముద్రణము 500 ప్రతులు.

కాపీరైట్. 1922 వెల 0-1-0.

# పీఠిక.

ఆర్యులారా !

ఈ గ్రంథకర్తగారు మాగ్రామములో నుపాధ్యాయులుగానున్న తరుణమున మాకోరిక మీఁద లీలామానుష విగ్రహుఁడగు భగవంతుని దశావతారచరిత్రము నెల్లవారికిఁ దెల్లమగునటుల సులభశైలిఁ గీర్తనరూపమున రచియించిరి.

అద్దాని నచ్చొత్తింపించి ప్రచురపరచుట యే కర్తవ్యమని తలంచి గ్రంథకర్తగారి యనుమతిఁ బొంది ముద్రింపించితి. దీనిపై వచ్చు లాభముతో నిటఁగ్రొత్తగా నెలకొల్పఁబడిన "శ్రీరామవిలాస పుస్తకభాండాగారమున" గొన్ని పుస్తకములు కొని వృద్ధిఁ జేయఁదలంచితిని.

కావున నుదారహృదయు లెల్లరు నీపుస్తకముంగాని నాకుఁదగినంత ప్రోత్సాహముఁ జేకూర్పఁ

గలందులకు సవినయ పూర్వకముగా విన్నవించు
కొనుచున్నాఁడను.

ఇట్లు,
ఆర్యజన విధేయుఁడు,
మత్తిరామారావు.

క్రొత్తపాలెం,
1-10-22.

# దశావతారములు.

వెల 0-1-0

ఇది వలయువారీ దిగువ విలాసదారునకు
వ్రాసికొనినఁబడయఁగలరు.

మత్తిరామారావు,
క్రొత్తపాలెం,
(పోస్టు) చల్లపల్లి.
కృష్ణాజిల్లా.

శ్రీ

కృష్ణ గురు పరబ్రహ్మణేనమః,



# దశావతారములు.



గీ॥ మత్స్యకూర్మ వరాహ న ♦ న్మహిత నార
సింహ వామన భార్గవ ప్ర ♦ సిద్ధరామ
రామరామ బౌద్ధ కలికి ♦ రమ్యరూప
ముల నిరంతరమాత్మలోఁ ♦ దలఁతుభక్తి॥

శ్రీరాగం - ఆటతాళం.

ఓమహాదేవా । నీమహిమామెన్న తరంబె॥ ఓ ॥
ఓమహాదేవా మ । త్స్యాద్యత్ప్రభావా ద
యామయభావ నిఖి । లాశ్రితజీవ॥ ఓ ॥

1 దేవతాప్రీతిగా । యజ్ఞములు భూ । దేవులొన
రింపఁగా । కనుఁగొని హాయ । గ్రీవా సురుఁడు
వింతగా తద్భాగము నా । కీవలెనని పల్కఁగా।
శ్రుతులల్లో నీ । కీవలదనియుండఁగా। ఏకరణి నీ।
కీవచ్చునని యనఁగా । క్రుద్ధుండై । ఓవిప్రులా
రా! శ్రుతు । లేవిధమునఁబల్కె । నోవిచారిం
చెద। నావిధముఁ జూడుఁడం॥ చావిధికడకుఁజని
బహుళ మా । యావియై శ్రుతులం గొనఁగ
మ। త్స్యావతారము లెత్తి వానిని। జంపి శ్రుతు
లాయజునకొసంగిన ॥ ఓ ॥

2 సురలసురులుమించి । సుధాబ్ధినిఁ । దరువఁగాఁ
దలంచి । కవ్వముగా మం । ధర శైలమొనరించి!

రజ్జువుగా వి। స్ఫురవాసుకినుంచి। నంతనమునఁ।
దరువఁ బ్రారంభించి। నంతనెమం ॥ ధరగిరిశరధి
లో। సారుగఁ గ్రుంగ్గానిదాని। శరధిపైనిలువనే।
వెరవుఁ గోఁపకళ్ళి ॥ షారిపరాత్పర కావవేయుని
శరణుఁ జొచ్చినయంతఁ గమఠే। శ్వరుఁడనై
మూపునను నలమాం। ధర గిరీంద్రమునుం
ధరించిన ॥ ఓ ॥

3 మును హిరణ్యాక్షుఁడను। దైతేయుఁ। డనుప
మానతపమును। బ్రహ్మనుగూర్చి। ఘనముగఁ జే
యఁగను। బ్రహ్మానంద। మునవరములీయఁగను।
తద్గరంబున నుప్పొంగుచును। దిరుగుచుఁద
నంత్రో ॥ అని సేయఁగ నెవ్వ। రేనయుదురనికనుం।
గొనుచు భూమిని సంద్రం। బునఁగలుపఁబూ
వఁగ ॥ వనజభవు వాసి శారంధ్రం। బున వెలువడికి
టీంద్ర రూపంబున। ధరంధరియించి వానినిఁ ॥
దునిమి ధారుణి నుద్ధరించిన। ఓ ॥

4 దితికుమారుఁడైన। కనకకశిపుఁ। డతులతపోబల
మున । గర్వించి శ్రీ । పతి! నిన్ దూరుచుండిన ।
ప్రహ్లాదుఁడనుతన। సుతుఁడదితగదనిన। గోపించి
క్రూర । మతి నతనిశిక్షించిన। మానకయతఁడు।
చ్యుత! నిన్ దలఁచుచుండిన । ఉగ్రుండై యు ॥
చ్యుతు నీ స్తంభమునఁ జూ। పితివేనినరి యేమా।
నితివేని న్నినిపుడు। హతముఁ జేతునన న॥ ద్భుత
ముగా నా స్తంభమున నతు। లితనృసింహా! కృతి
వహించితివి। దితిసుతుని తలఁదునిమి పరమా।
ద్భుతిని ప్రహ్లాదునిమనిచిన॥ ఓ ॥
5 పాకశాసను నీ । తటి మిన్వర్గ । లోకమును గై
కొని బలిదానవుఁడ । నేకవిభవముూని । యుం
డఁగ నింద్రుఁ । డాకలములుదిని । అడవుల నొం।
దాఁకయుండుదున నీ। పొగలుచుఁగరు । ణాకర!
వినుభక్తిని। వేఁడఁగవాము। నాకారమునుబూని।
బలికడ కేఁగి॥ ప్రాకటముగ వాకుఱు బాదత్రయ
-సలము।జోకతో నిడుముని। రాకరింపక మనుచా

యాకనము భువి రెండడుగులుగఁ। జేకొనియు
మూడవ యడుగును ది। వొకసారి శిరమున
నిడి న్వ। ర్లోకమాయింద్రున కొసంగిన ॥ ఓ ॥

6 శ్రీమహితబలమున। కార్తవీర్యార్జుఁ। భూమిా
శుఁడొకదినమున। దిరుగుచువన। భూమి కేఁగియం
దునజమదగ్నియనుమ। హాముని యాశ్రమమున।
జేరఁగ్నన్వ। డావహాని సంతసమున। కనఁగొ
నితన। కామధేనువు మూలమున। దృప్తినిఁ
జేయఁగా। మానఁగని ప్రియమున। అతండుదన।
కామొదవు వీమనిన। పలదనవహాని। వామునఁ
దలఁదునిమిన। గన్గొనియున్వ॥ డావహానిగర్భము
నం। దవతరించిన హరను। రామమూర్తి। యల
ను తాత్రిమాదులెన్నఁగ॥ నామహీశుసహస్రభా
హులు। తోమహింబడ నేసి రాద్యు। మామూల
ముగా నిరుపదొక। మారుదునిమి యశంబుఁ
గాంచిన ॥ ఓ ॥

7 ఆపూర్వ వంశమున । బుట్టిశివశ । రాసనము
క్రమమున। విఱిచినీ। తానతినీముదమున । నై
కొనితండ్రి । శాసనముచొప్పున । సోదరభా ।
ర్యాసహితముగ వనమున । ఉండఁగ రావ ।
ణాసురుఁడు కుపితమున । వచ్చి సీ । తానతిని
గొనిచనిన। అంతటసంజ। నీసుతు సాయమ్మున।
కపినాథుఁడౌ । ఆసుగ్రీవుసపొందుఁ । జేసికపి
సైన్యము । బానటయ్యేము డఁ । గాఢమ్ముదమును
గట్టి । భానమాన బలమున రావ । ణాసురుని
పతుల్ని బయగవిగ । తానుఁగనొనరించి యానీ
తాపతిఁ గైకొన్నరామ । ఓ ।

8 ధారుణీశా త । దుష్టుల బారి । కోరువకచింత
నొంచుచుసినుఁ। జే వేఁడినంత। ఆపెరునో। దారి
చిసిశ్చింగి। నుంజుము నీ। బారము నేనంత। దీర్త
వసి కృపారఁబల్కియుంత । వసుదేవునకుఁ గు ।
మారుఁడ నైవింతి। గాజనియి · చి ధీరజనులకున!
పారముదమొదవదు। ర్వార బాహుబల । వీరుఁ

డవై మహా॥ క్రూరులౌ గంసాదులను సం। హార
ముఁ గావించి భక్తుల। కోరికలు నెరవేర్చినమహో
దార శ్రీబలరామమూర్తి॥ ఓ ॥

9 త్రిపురదనుజులు చెలఁగి । దేవతలపై । విపరీత
ముగ నలిగి। చాలఁగఁదా। మపకృతిములు గడఁ
గి। చేయఁగవా। రుపమ దోఁపక తొలఁగి । ఉం
డఁగ వారిఁ। గృపఁగావఁగనెగి। బుద్ధాకృతి। నుప
ముతోడమెలఁగి । తత్సతులు ప । లుపువ్రత
ములు నెఱిఁగి । తద్వ్రతభంగ ॥ ముపదేశ బల
మున । నపుడగావించి యా । త్రిపుర సురుల
రుదు్రి । నెపమునఁ దునుమాడి॥ విపులతర యశ
మొందియావి। ష్టపమునకు శ్రేయమొనఁగూ
ర్చిన। కపటనాటకసూత్రధారీ!। గణుతిఁ జేయఁగ
నాకునశమె॥ ఓ ॥

10 కలియుగమునఁ బ్రబలీ। మ్లేచ్ఛులు కదుఁ। జెలఁగి
ధర్మము వదలీ। వేలఁగమాన। వులు తమలోఁగన
లీ । తిరుగుచువర్ణం । బులధర్మములు విడిచి

స్వల్పాయు। ర్బలశాయుతైవబలీ । ఉండఁగనవి।
తిలకించిమదిఁగెరలీ। ధర్మంబును ॥ నిలుపుటకై
కదలీ। శంబళపురి॥ అలకువిష్ణుయశు । నకుదేవ
ప్రభకుసి । య్యెలఁగల్గి మూర్తివై । చెలువుగ
జన్మించి॥ కలియుగాంతిమునందు ధర్మము। నిలు
పఁజాలిన ఘనుఁడవగునీ । యలఘు మహిమము
వినుతిఁజేయఁగ నలవియగునె నలువకైన॥ ఓ ॥

11 లీలఁగృష్ణాతరము । నందలరారు । శ్రీలలితా
పురము। నందునరుక్మి। ణీలలనాసహితము । గా
వెలసిభక్త । జాలమునకు వరము । లిచ్చుచుఁ
గృప । నేలుదువనినిత్యము । శ్రీవేణుగో। పాలా
నీపదపద్మములంతరంగమున। జాలఁగనిలిపి శ్రీలో
లవేఁడుచునుంటి। జాలమేలమోర్వ। జాలసూరక
విహ్వలుల్లోలసద్గుణ।జాలకరుణా।వాలనతిజన।పాల
సన్నుత । శీలననుగ్రహ। నేలుమాయను। కూల
మాచల మూనునెడల । ఓ ।

—(*)—

# మంగళహారతి.



కాంభోజిరాగము - ఆదితాళము.

కృష్ణానీకిదిగో హారతీ ॥ మాంపాహి ॥ శ్రీ॥ కృ॥

1 దేవకీ వసుదేవులకు । దివ్యముగ జననమంది ।
భావితంబుగాను జగతీ । దేవీభారము బాపిన
శ్రీ ॥ కృ ॥

2 ఉద్ధవాది భక్తులను । నుద్ధరించినట్టి వాఁడవు ।
బుద్ధిహీనుఁడైనన । న్నుద్ధరింప వేఁడెద శ్రీ॥ కృ॥

3 భక్తజనులకునను । రక్షుఁడనై మెలంగుచునా ।
సక్తితోడఁ గొలుచువారికి । ముక్తిమార్గముఁ
జూపు శ్రీ॥ కృ॥

4 మూఁడులోకములకు నీవె। మూలమగుచు వె
లయుచుందువు । జాఁడదెలియ నెవరివశమో ।
సర్వలోకశరణ్య శ్రీ॥ కృ॥

5 భాసురలలితా పురని । వాసవేణుగోపాల
సూరదాసుని యభీష్టము ను। ల్లాసముతో
దయసేయు శ్రీ॥ కృ॥



# బృందావిజయము.

[ అచ్చులోనున్నది. ]

ఇందు బృంద (తులసీ) వివాహము జలంధరుని ప్రతాపము బృందపాతివ్రత్యము విష్ణుమూర్తిమాయాప్రభావము పాతివ్రత్యము మొదలుగాగల పెక్కు విషయములు మృదుమధుర శైలి ప్రదర్శనానుకూలముగా రచియింపఁబడిన యైదంకములుగల నాటకము.

స్త్రీ పురుషులకు నిత్యావసర నానుకూలమని మహాపురుషులచేఁ గొనియాడఁబడినది.

దీని ఖరీదు 0-8-0 మాత్రమే వలయువారీ దిగువ విలాసమునకు వ్రాసికొనినఁ బడయఁగలరు.

దేవినేని సూరయ్య,
తెలుఁగు పండితుఁడు.
శ్రీమంతురాజా మాధ్యమిక పాఠశాల,
చలకగి.

